ఈ నా రచనలను వినియు చదివియు ఆనందించి
వీటి ప్రచురణకు నా కన్ని విధాలా
సహాయమై ప్రోత్సహించిన మిత్రులు—
శ్రీ సిరిప్రగడ వెంకటరామ లక్ష్మీనరసింహా
రావు (దేశపాండ్యా సిరిదేపల్లి నైజాం) గారికి -
నా కృతజ్ఞత.

ఇట్లు,

అం. వెం.

ఆంధ్రభాషాయోషకు ప్రతి తెలుగుబిడ్డ దోనర్చు
సేవయును విధియే యగుటచే నా చేసినది గణ
నీయము కాకున్నను దానికొక ప్రాధాన్యత నిచ్చి
అజ్ఞాతముగా నుండనీయక తన కృతితోపాటు
ఆంధ్రపాఠకలోకవిహారమునకు యోగ్యతగలదాని
నిగా కల్పించిన మిత్రులు— శ్రీ అంబటిపూడి
వెంకటరత్నం (అగ్రహారీకులు ఏదుబాడు
అగ్రహారం గుంటూరు జిల్లా) గారికి-
నా కృతజ్ఞతాభివాదములు..

ఇట్లు,

వెం.

"Where the mind is without fear and the head is held high;

Where knowledge is free;

Where the world has not been broken up into fragments by narrow domestic walls;

Where words come out from the depth of truth;

Where tireless striving stretches its arms towards perfection;

Where the clear stream of reason has not lost its way into the dreary desert sand of dead habit;

Where the mind is led forward by thee into ever-widening thought and action;

Into that heaven of freedom my Father! let my country awake."

*Rabindranath Tagore.*

" ఎచ్చోట మనస్సు నిర్భయంగా ఉండగలుగుతుందో,
తల ఠీవిగా ఎత్తబడుతుందో;
ఎక్కడ జ్ఞానం విచ్చలవిడిగా లభ్యమౌతుందో;
ఏ కడ లోకం కుటుంబభిత్తికలచే భిన్నభిన్నంగా
ముక్కలు చేయబడదో;
ఏ సీమ వాక్కులు సత్యాగాధంనుండి వెలువడతవో;
ఏ వాడ విసుగులేని కృషి పూర్ణత వైపు
చేతులెత్తుతుందో;
ఏ ప్రదేశాన నిర్మలహేతులహరి అభ్యాసమనబడే
భయంకరపు ఎడారియిసుకలో మార్గభ్రష్టం కాదో;
ఏ వీధి మనస్సు నిత్యవిస్తృతినొందే సంకల్ప కర్మలలోనికి
నీచేత ముందుకు ముందుకు నడపింపబడుతుందో –
అట్టి స్వాతంత్ర్యస్వర్గధామంలో ప్రవేశించడానికి
తండ్రీ! నాదేశం ఉద్బుద్ధమౌగాక ! "

రవీంద్రనాథ టాగోరు.

'చిత్రమయజగత్తు' నుండి అనువదింపబడి 'సుజాత' తెలుగు మాసపత్రికయొక్క ప్రథమ మాఘమాసపు సంచికలో శ్రీ. జి. వెంకోబరావు గారిచే ప్రకటింప బడిన 'కళంకము' అను కథ యీ రచన కాధారమగుట వారికి నా కృతజ్ఞత.

ఇందలి చారిత్రకాంశములన్నియు - సర్ థామస్ హే డైరీ నుండియు, టైమ్సు పత్రికా ౬ సెప్టెంబర్ ౧౭౫౭ నుండియు, ౧౦ సెప్టెంబర్ ౧౭౫౭ "మారకారా" ఆధారము నుండియు గ్రహింపబడినవగుట విశేషము.

పద్యకావ్యము గాన తదనుకూలముగ మెలిచిన నా మెలుపులు బుధుల ఆదరణకు పాత్రములనియే నా విశ్వాసము.

విదులు తగిన మార్పులను సూచించుచో విధేయుడనై స్వీకరింతును.

# పూర్వమ్

“ విమలహిమాలయోద్భవప
విత్రధునీ! జననీ! నుతింతు ని
న్నమరతరంగిణీ! కలుష
హారిణి! జహ్నుసుతా! భవత్కథా
సుమమకరందగంధముల
సోకియు నీకు జోహారు లీయ
కుమతులు వారికే గతులు
గూర్ప దలంచితివే వియన్నదీ? ”

అని యశ్వమేధఘట్టము
న నిమజ్జన మాచరించి నయగాగతసం
బున రామపాలసింహుం
డనిమిషులకు దగిన పూజ లట సల్పు నెడన్

వినబడె భారతీస్తుతిసి-
వేదసగీతి, సొంపల్ గగుర్పొ. చు
ట్టును దిలకించ గాని యువ
డున్ గనుపట్టదు. నిమ్నగాతటం
బున తనసేన నిల్చుదెస
బోవుచు నాగె. జటల్ ధరించి భూ
తిని తనువెల్ల నింపి జల
తీరమునం దొక యోగి సాశ్రుడై

" జయ వీరభారతీ
జయ విశ్వభారతీ
జయ దివ్యవిజ్ఞాన
విపులశోభావతీ !

మైనాదేవి

జయజయ శ్రీవేణి శార్ద్రీ తేజోవతీ
జయజయ స్వప్రజానందదీక్షావతీ
జయ నిఖిలభువనతలమణి వీరభారతీ
జయ భావిభాగ్యగర్భిణి విశ్వభారతీ

జయ వీరభారతీ
జయ విశ్వభారతీ
జయ దివ్యవిజ్ఞాన
విస్ఫులింగోద్భావతీ! ''

ఇట్టు లాపాదశిరంబు నెత్తురులు వే
డెత్తగ గభీరార్ద్రి యై
స్ఫుటనాదంబున వేదనామధువు ను
ర్వ్యాల్ దేల పొంగించి పా
డుట చాలించెను కన్యక దేవిచి పో
టుబంటు నీక్షించి ''ర
మ్మిటు పుత్రా'' యన వచ్చి మొక్కు ప్రతినా
గీశాను దీవించియున్

" తనయ ! ఈ చేయుపయన మెందాక ?– ఏమి –
ఏమి – కాన్పూరువల కందు వేమి పనులు "
అని సటాచ్ఛట వింతగ వెను విదల్చి
యడుగ నిశ్శంకుడై వీరుడనియె నిటుల

" స్వామీ ! హూణుల కేను సాయపడు
వ్యాపారిక, సిపాయీలు తుత్
క్షామం బొందకముండె ధాన్యము పదా
ర్థవారితముగ గూర్చ నా
కో మహానీశ్వర ! బాధ్యతల్ గలవు
ఈ ఒంటింపు పంజాబునం
దై మేలయ్యెను పుట్టినిల్లదియె ఆ గ్రా
కాని కాన్పూరుహో

ఆంగిలేయబలంబు లాహోరమునకె
వాచి మలమలమాడెడి వార్త తెలిసి
వలయు సామగ్రి గూర్చ నా పనియె యగుట
దమునవైతిని తనయ నొప్పదు మహాత్మ ! "

" బూటకమ్ముల్ వచించుటకు
పుట్టిమునింగిన దేమి వత్స? యీ
పాటికి నాల్గు మాత్రమె ది
నమ్ములముందటి నుంటి నేను; ఏ
కాటుక ముండదచ్చట, సు
ఖమ్ముగనుండె కాలమ్ము లెల్ల, నీ
మాట నిజమ్ము కాదను వి
మర్శలు నాకవిగోల పొమ్మికన్ "

అనెడి జడదారినుడి సందియమ్ముగొలుప -
' కాదు తపసి నిజమ్ముగా కాడితండు
ఐనచో నీతనికి నేనలందు గలుగు
కష్ట సుఖములపై సింత దృష్టి గోల '

అని తలపోసి వీరుడు " మ
హాశయ ! కోపము కల్గకున్నచో
మనవి యొకండు సేతు " నన
" మంచిది పల్కుము భీతి నీకు మా

తనయ'' యనంగ యోగి. ''గృహ
దారలపై మమకార మేద నీ
మునిజనవృత్తిలో దిగిన
మూర్తమువో నిపు డెంత కాలమా

పుట్టిన దే పురంబు విన
బుద్ధి యగుగా మహనీయ !'' యన్న
నా పట్టిని జూచి తాపసుడు
''శిష్యుడ ! మానసిగ మారుటెల్ల
చేపట్టిన కార్యమందున న
పారఫలంబును బొందగోరి,
యీ దిట్టతనంబుతో ఫలము
తేలిననాడు గృహస్థునే సుమా !

ఇట్టు లేనయి గడనలే దెన్నొ నాళ్లు
నాది విఠలపుర'' మని నట్టు సేయ
రామపాలుని సంశయరాజి పెరిగి
యొకటి జడదారితో పల్కెనిట్టు లతడు

“ ఈ రోజుల్ కడు తీవ్రమైనవి వీరా
గ్రణీ ! హూణా వైరుధ్యమం
దే రాష్ట్రంబున నింతో యంతో విపరీ
తేచ్ఛాప్రచారంబులే
మేరల్ మీరి పెరుంగుచున్న విక నీ
మేకోలు శంకాస్పదం
బై రాజ్యాంగవిరోధ ములౌతడను నూ
హాల్ గల్గుటల్ చోద్యమే ”

ఎప్పు డిట్టి నుడుల్ చెవి సోక్క నప్పుడే
తబిసి మనసు ముహుర్ముహుస్తప్త మగుట
నతడు నిలబడి నిశితేక్షణముల బరపి
వీరవరు మందలించి గంభీరుడగుచు

“ నాయక సందియమ్ముగాను
నర్మిలి జూడగ నీ వదేమొ ఆం
గ్లేయుల గుప్తశోధకన -
రేణ్యుడవం చనుమాన మ్ముద్భవం

జై యెద నూచుచున్న దిక
నయ్యోడి దేమియొ కాకపోవు నే
నీయెడ జెప్పగా దగిన
దెద్దియొ దాని వచించి తీరెదః

నాడిబంగరుటిండ్లు వీడి వచ్చిన నదీ
కాంతలు విహరించు కనకభూమి
ఘోరాటవిః లేటికూనకు పులివద్ద
పాలు ద్రావించిన బ్రహ్మభూమి
చెఱుగును ద్రుంచ నుంచిక బావుటా నెత్తు
తనువు లర్పించిన ధర్మభూమి
తోడి దేశములు కన్దోయి విప్పని వేళ
నర్తించి కలికిన నాకభూమి
ఇది భరతభూమి నీ పుణ్య మోదియొ పండె
భారతీయుడ వైతివి ఫల మదేమి
జనని నర్చింతువో లేక జన్మభూమి
కెదురుగా నిల్చి కత్తి నెత్తెదవో నేడు

ఒక జీవి నూతగా నొంది మాతని కథ
కల్లి పేదగ నిల్చి నదియు గాక
ఏ మతి కింపితమ్మో పథమ్మో దాని
తీర్చి యీయగలేని దేశ కాక
మనచేయు నిత్యకర్మలకు దూరమ్ముగా
నిలచి క్షణాదృష్టిగలది కాక
అణువాది బ్రహ్మపర్యంతము మనదగు
రీతి చెప్పగలేని ప్రేతి కాక
పరమపావనసూత్రసంబద్ధమైన
దార్యధర్మము నీరక్త మార్యదత్త
మెట్టి బాంధవ్యమో చెప్పనేల తిరిగి
తల్లి గర్భమ్ము గోయు పుత్రకు డెవండో

తోడబుట్టిన వారి మైత్రోళు లాలిచి
పరుల కాళ్లకు చెప్పు లప్పనము గాగ
తొడిగి ముద్దాడి కండల గుడువ బెట్టు
వాతి నీ తల గలదా నిల్వకుము పొమ్ము. ''

ఛాతిబొమ్మలు కదలి గర్జనము జేసి
కర్మభూమికి కంకణాఘుంటికలను
దాల్చి రాగల వీరబోధనము సలిపి
పుత్రధర్మంబు సూదుల బొడిచి చెప్పి,
అరగె నా యోగి తెలియ దే యంకమునకో

ఒంటిగ నున్న వీరవరు
డుల్లము తెల్లపె మది పల్లు నా
వంటి ఖలుండు లేడని వి
భంజితుడై తపియించి గుర్తురా
బంటుల జేరి స్వీయపరి
వారముతో పయనించె గాని వె
న్వెంటనె యోగి యున్నటుల
వేయి తలంపుల స్రుక్కుచుండె చనె

చని కాన్పూరున హేదొరక్ గలసి ప్ర
స్తావింప నాతండు "వా!
సెను శ్యానిం గిది చూడుమో వినయరా
శీ!" యంచు వే నొక్క లే

ఖను జూపింపగ కేల నంది
వ్రతభంగం బొందు తేజస్విహృ
ద్వనజం బట్లు తపించియుండ్ తిరిగి ప
త్రంబందు నీక్షించుచుండ్

— లేఖ —

" సగదా నా మన నామపాలనగు ని
స్సందేహివై తెల్పు ' మె
వ్వగు నేరం బొనరింతు రా ప్రజల వ్యా
పారంబులందెల్ల తీ
వరమగా నేరుపు జూపి వర్తిల ' గ —
ఎవ్వారైన మీరెల్ల రే
మరగా దిత్తఱి రేపా మాపా మనతో
నాత్మసత్యసంఘర్షల్లుడై

పోరు సలుపగ విఠ్ఠలపురనివాసి
నానసాహెబు కత్తిచే బూని నచ్చు
నను వదంతులు పెల్లు రేగినవి కాన
తెలివి తేటలతో నుండవలెను సుమ్ము "

అని పఠించి విఠ్ఠలపు
రాఖ్య గనంబడ విభ్రమంబు పై
కొన దలచె " ధునీతలిని
గూడిన యోగి యతండె కాడె 'నే
మునియగు నొక్క కార్యమున
పూర్ణఫలంబును బొందగోరి ' యం
దవియె నతండు కావలయు
నాతడు నిక్కము నాకసాధించె "

ఏ దిన మెట్టిం గీ యువరి
కే ఫల మిచ్చునో కాలనేత
గో వాదము సేసిరా తన వి
వాదము నెగ్గెడి తీర్పుసేయు కా
రాదని లేదా నోరెరుగ
రాని దచేతన మిద్ది చేతనం
బీ దినుసన్న భేద మెద
నించుక చింత యొనర్ప దక్కటా !

ఆ దివ్యసౌధ మే యసమాన శిల్పి చే
తుల తీరుపొంది మెప్పులను గనెనొ
ఆ భవ్యహర్మ్య మే యధిక వాంఛావల్లి
కనిపెంచుకొన్న బంగరుసుమమ్మొ
ఆ పుణ్యభవనకళ్యాణ శీతచ్ఛాయ
లం దెంత లోక మానంద మొందె
ఆ పావననికేతనాంతఃపురీవాటి
తనిపె నెన్నెన్ని సౌందర్యలతల
ఆ యనర్ఘంపు సదన మే యఘ మొనర్చె
కాన్పురమ్మున మనికియో కలుష మేమొ.
నానసాహెబు దగుట ఆనాడు దోసగో
గుండె లిచ్చెగదా ఫిరంగులకు మేడ !

అది యచేతనమయ్యు నాత్మాభిమాన
మింత నిలబెట్టుకో ధన మెంత యొసగె
కనికరములేని పరుల కర్కశపు వ్రేటు
లెన్ని యెన్ని ! తనుచ్యుతి నేది దిక్కు ?



మైనాదేవి

మానిసి జాడ లేదనిన.
మందిర మప్పు డుదారమాళిభా
గాన ధరించి చూపినది
కాంచనమంజులగాత్రవల్లరిన్.
మానిని నొక్క కన్నియ న
మాయిక నాత్మజ నట్టు: లే
మాను నరాత్ము లా గడియ
యంను గరంగక కక్కసించుచో.?

నిలువక ప్రేలు తోపులు ధి
నీవినకుండిరో సైనికుల్ వృథా
కలమత్తమై నిమారి 'తుగిటి
కోపము నాపగలేరె' యన్న వా
క్కులు; నొక కొంతసేపటికి
కూర్తరత సిల్పి చమూనియంత 'స్వా'
కలికి సమీపముం జని ప్ర
కంపితుడయ్యె స్మరించి దేనినో

అప్పు డా బాలిక నోట తేనియలు చా
యఁ శుద్ధహూణంబు జా
లు వడఁ భాషణసేసె 'కారుణిక! నీ
రుల్ మీరు యీ మేడపై
కృప కించిత్తు వహించి కానగలరా
కీర్తింతు మీ పుణ్య' మ
న్న 'వసంతీ! భవనంపు రక్షణముపై
నఁ వాంఛ నీ కే' మనన్

"భవన నిర్మూలనము బుధవర్య మీకు
కాంక్షితం బెట్టు లాయె నా కారణమ్ము
మీరె సెలవీయ మొద" లని మారుపలుకు
బాలికను గాంచి హేంద్రోర పలికె నిటుల

"-రాజవిద్రోహులై కుట్ర రగులు కొలుపు
నానసాహెబు భవనచిహ్నము జగాన
అణువు లేకుండ చదును జేయంగవలయు -
నేడి ప్రభుశాసనములు కారణము బాల!"

" ఇదియా కారణధర్మ మార్యవర ! మీ
కెవ్వాఁడు విద్వేషియై
కదలెన్ ఖడ్గము బూని యాతఁ డగు శ
త్రూపాత్రు డేమైన, నీ
సదనం బౌర జహంబు; ద్రోహి కిడు శి
క్షల్ దీనికా సౌమ్య ? నా
హృదయం బిచ్చిన దీ పవిత్రతల మే
నూహించు స్వర్గ మ్మిదే.

ఈ యింట పసిపాపనై అమ్మయో మ్మపాల్
జీకి నేర్చితినేము చిఱుతనగవు
ఈ నేల పారాడి యింత యడుగిడ నేర్చి
గిలుకుటందియల చిందులిడ లేదె
ఈ గూటినీడ నాకెన్ని రేలు పవళ్లు
తనువోడి బ్రతుకు సత్కవుల గోష్ఠి
ఈ గవాక్షములు నా కెన్ని బొమ్మలు చూపి
చదివించె గగనపుస్తకపు పుటల

ఇచట ప్రతిరేణువును ప్రాణమిచ్చి నన్ను
పెంచి పెద్దగ జేసిన వీరమాత
కృప వహించవో ఆత్మ వెల్గించుకొనవో
నా యొడలు కాల్చి నిలుపు మన్నా! గృహమ్మ''

'' బాలా! చేయగరాని పాతకము నా
పాల్ జిక్కె. నేమందు. బా
ధాలీనమ్మయి నా హృదంతరము సం
తాపించు సంతాప మం
తే లేకున్నది విశ్వసింపుము : మదీ.
యేష్టంబు రాజాజ్ఞకున్
కేలుందోయిని మోడ్చి పోవలయు నం
గీకార మున్నట్టులే''

'' ఈ సకలమ్ము సైన్యమున
కీ వధినేత వెరుంగుదున్ యశో
భాసుర ! పేరు హేడ్వార- అ
బద్ధమె ? నీ ప్రియపుత్రి 'మేరి' సా

వాసము నాడు నన్ను గని
' బాలిక ! నీ వొక చిన్నమేరి, వా
యాసము తీఱు నిన్ను గని
నంత ' నటుఁమువు గుస్తు దప్పెనే

ఇది యొక లేఖ మేరి లిఖి
యించిన, దిప్పటి కప్పుడే చనెఁ
పగపడి గోంట్లు మూగా; డప్పుడు
పల్కెను ' చెల్లెల ! తండ్రిగారికిఁ
ముద మొదపించు దీని నిడి
పున్నెము బొందు ' మాటుంచు – నిట్టి యా
పదపము దీయగా వలసి
వచ్చెను ప్రాణసఖిస్మృతి న్యతికిఁ "

అని యా బాల వచించు వైఖరి క్రమ
వ్యాఘాతమై వాని నె
మ్మనమునఁ గాయము జేసి, పోయిన సుతా
మంజూషలో నిండి నె

ల్గిన మాణిక్యవిలాసముల్ స్మృతికి గీ
లించెన్; త్రుటులుల్ సాగిపో
యిన లక్షింప డతంబు; కొంత తడవ
య్యెన్ బల్కె నీ రీతిగన్

" నానాసాహెబు కేకపుత్రికవు మై
నా! నీవు మా మేరియున్
ఏ నేస్తంబున నాకి పాడితిరొ హా
యిన్ గూర్చు నా రోజు లా
రా నా జన్మకు చూడబోను: కనులా
రన్ దాని చేవ్రాతంగో
నైనన్ ముచ్చట జూచి కానుకలు గా
నర్పింతునే బాష్పముల్ "

అని కే లెత్తిన వాని కందానటు లా
హార్మ్యాగ్రమం దుండి తే
ఖను చేజారిచి వైచె నామె: అతఃప
త్కాంతన్ విడన్ దీసి మా

గని కన్నీటిని గోట మీటి చనువం
గా లోని సందేశ మే
మని తీర్చంగల దెవ్వ రాగగల డం
త్యాగాంతుడగొ పుత్రుడన్ !

— మేరి లేఖ —

" నా చెలియ నా ప్రాణము నా సమస్త
జీవనమ్ముగ దనరిన చిన్ని మేరి
కాపద తటస్థమైనట్టు లరయ దేని
కావు మో తండ్రి యిది నాకు కడను కోర్కె "

ఉన్న యొక బిడ్డ ప్రాణమ్ము లోడి చనుచు
లేతనోరార కోరిన లిప్ప యొకట
చండమగు ద్వారఘోర శాసనము లిడిన
కార్యభారమ్ము గుండెలో కలచు నొకట

పొత్తు కుదరని ఈ రెండు పోకడలను
దేని విడనాడుటో మరి దేని బొందు
టో విధింపగ లేక నానావితర్క
సంకులాత్ముడు వలిగి బాష్పములు విడుచు

జనర 'లాటారీము' అప్పు డచ్చటికి రాగ
'హేం' సమస్తము వచియించి విధిగ బలికె
"ఏది యెటులైన నానసాహెబు గృహమ్ము
భగ్నమై పోనియట్లు కాపాడవలయు"

" కానే కాదిది సోదరా! బహుళగుః
ఖస్సంది ఖా కార్య, మా
నానాసాహెబుపై ప్రభుత్వము ప్రచం
డక్రోధమున్ బూని లేదో-
నీ విద్ది యెరుంగవో - ప్రబలవి
ద్రోహుల్ సుహా వీర లా
నానా పక్షము వారలే - యనెడి నిం
దన్ మోపి శిక్షింపదే!

ఆతడే కాదు' ఆతని యన్వయమ్ము
సర్వ మీనాడు రాజశాసనము తోని
కోపవిలయాగ్నిశిఖలలో గూలవలెను:
మనకు పునరాజ్ఞ లేనిదే మాన్పగలమె? "



మైనాదేవి

" ఔను చెలికాడ ! పునరాజ్ఞ నందవలెను
దానికొరకిప్పుడే వేగ తంతివార్త
ప్రభువు క్యానింగునకు బంపవలయు, నాత
డంపు వార్తను గన కుద్యమింపరాదు. "

" ఓయి ! నీ మతి కెయ్యది యోగ్యమనుచు
తోచునో నీవు నా మ్మట్టి తోవవెంట
నేను మాత్రము పోయి మైనాను పట్టి
యిూడ్చుకొనిరాక మాన నీవేమి యన్న. "

" కట్టా ! నే వినజాల నింతటి పనిన్
కారుణ్యమున్ వీడి నే
నెట్టుల్ జేయగ నోర్తు, బిడ్డ నటు నా
యిందుస్ఫురద్బింబమున్
పట్టీ యంచు కవుంగిలించితిని. ఆ
బంధమ్ము ప్రేమాత్మకం,
బెట్టుల్ ద్రెంతును ? తంతి నంపెదను; నీ
యిష్టమ్ము ఈ లోపలన్ —"

అని బహులు పల్కి ఔటాయము నాత్మనిశ్చ
యమును మైనాకు వినిపించి యచటు బాసి
తంతి సంపగ హే జనె నింతలోన
నిచట ఔట్రాము తనపట్టు నింత విడక

కాలవ్యాళముపోల్కి బుస్సుమనుచున్
కాల్ సువ్వి బుతుంబటుల్
తోలెన్ బంటుల మేడలోపలకు; భ
ల్లూకంబు ల ట్లా భటుల్
గాలింపన్ గృహ, మెల్ల నాల్గు దెసలన్
గన్పింప దా బాల. 'ఔరా !
లే, దెప్పట కేగె చిత్ర' మని వా
రాశ్చర్యమూఢాత్ములై

వెతకిన మూలలనే మరల
వే యొక నూ ర్వైతకంగ బోను, రే
వితమున నైన జాడ కను
పింపదు: ఒక్కడికొక్కసిస్ గదుః



మైనాదేవి

వెతగొని పృచ్ఛసేయును- 'ల
భించెనె బాల!' యటంచు- నాత- 'డే
గతి లభియించురా' యనుచు
కన్యకునై వెదకుఁ బదే పదే.

కంటబడిన భటాళిపై కన్ను లెఱ్ఱ
జేసి కోపించి గర్జించి ఛీ యటంచు
జనర లాట్రాము పిచ్చి యెత్తిన విధాన
సంచరిలు: నింక కలదొక్క జాము పగలు

ప్రభువు క్యానింగు హైదొర వార్త జూచి
తిరిగి పంపిన తంతి అందినది యపుడు,
పత్రి మిర్జ్వారు సేనాధిపతులు గలిసి
సంభ్రమము తోడ విడదీసి చదివి రిటుల

— క్యానింగు పంపిన తంతి —

" అచట నింగ్లాండులో మంత్రు లంద రొక్క-
కూటమిగ తీర్పు జేసిన మాట వినుము
తిరుగు లే దందు పాలించి తీరవలెను
ఘోర మందావా క్షమియింప గోరువాడ.

— మంత్రుల మాట —

'అవనిఁ ఎచ్చటనేని వాసి స్మృతిచి
హ్నం బుండగా రాదు త
ద్భవు లెవ్వారును ప్రాణవాయువుల సి
ల్వఁ రాదు నానాది యం
చవనిఁ చేతనమే నచేతనమె యై
నన్ బేరులేకుండ మా
య వలెన్ ఎట్టి పదార్థమైన, నివి మా
యాజ్ఞల్ అనివార్యముల్."

చటుల విలయోర్మిసంకుల సంగరాబ్ధి
నుఱుకుటకు ముందు తా నేగ నుత్సహించు
వాడు హే, నేను మహారాష్ట్రబాల నొక్క
దాని బంధింప సందేహ మూను నార!

వినుచునె కంపమొంది దుర
పిల్లుచు లోననె దుఃఖ మాపుకో
జనియు నశక్తుడై గృహము
చల్లగ వీడి యొకింత దూరమం

 మైనాదేవి

దీన పరిదేవనాచలిత
దుర్బలచిత్తుడు కూరుచుండె హే
కన నికముందు కాగలుగు
కార్యము లెట్టివో యన్న చింతతోన్

సేనాపతి ఔట్రాముడు
నానాభవనమ్ము నపుడు నాలుగు దెసలన్
పూనికమై భువి గూల్పగ
సేనను బురికొల్పె నంత చింతయు లేకన్

మైనాపుత్రి కుపాస్యమై వెలయు హ
ర్మ్యశ్రీకి దీర్ఘాయువుం
బానాడే పరిపూర్ణమై కఠినపక్ష
ద్గాఘాతజాతవ్యథన్
శ్రీ నిర్వేదము నొందెనా వినగ దో
చెన్ శీర్ణభాగమ్ము లె
న్నో నేలం బడువేళ: ఆర్తరుతు లె
న్నో మృత్యుభీత్యంకముల్ !

ముక్కలు ముక్కలై పడిన
ముద్దుల మేడ గోడల్ హరించి పో
రక్కసిబంటు లప్పు డన
లమ్ము రగిల్చి జ్వాలచ్ఛిఖాళిలో
చక్కని సౌధఖండికల
చావక నిల్చిన శిల్పచాతురీ
దృక్కుల లాగువాని బడ
ద్రోసిరి వ్రేల్చిరి భస్మమౌనటుల్

ఆవల నున్న గోదార భ
యభ్రమ మెల్ల నతిక్రమించి యూ
హావృతుడై చరించు భయ
దాటవులందో లయాగ్నియందో దు
ర్దావయుతాగ్ని భీకరత
రంగములందలి సందులందో యే
త్రోవనో కాని నేత్రములు
తొల్గక చూచె కఠోరదృశ్యముల్

చూచి కడ కాంత దొల్కు నశ్రువులతోడ
"అబ్బ! నే నేల కంటి నీ యసురకృత్య
మిది మరువజాల ప్రాణమ్ము లేగుదాక"
నని తనకు తాను భాషించుకొనుచు జనియె.

*

నాడు షోడశకళల పూర్ణముగ వెల్గు
పండు చందురు నాటంకపరుప నొక్క
మబ్బుతునకైన లేని నిర్మలవియత్తు
నిద్రితజగత్తు తళుకు వెన్నెల నలందె

ఆ నడికిరేయి తెలివెల్గు లీను వలిప
మొందు ధరియించి ముద్దు నెమ్మొగములోన
వగపుచీకట్లు తాండవింపగ నలంగు
పదియునారేండ్ల మహారాష్ట్ర బాల యొకతె

మంట్లలకు మారుమసలి యొండొంటి నంటు
కొనియు పొగచూరి నల్లనై కూలియున్న
శిథిలసదనంపు కుడ్యావశిష్ట శిలల
నడుమగల బూదిలో రోదనమ్ము సేయు

బంటు తాత్రాము—నాయకత్వమున మెలగు
వారు విడిసిన చోటికింతో దూరమందు
లేదటకు, గాన బాలికా రోదనమ్ము
వారి మేల్కొల్పి యబ్బుర పడగజేసె

" ఈ యపరాత్రి నెవ్వరో
'ఓ' యని యేడ్చెదరు, కంఠ మువిదది సుమ్మా
పోయి కనవలె నెవరో
యాయమ" యని కొండ తేగి రందలి బంటుల్

కలువ కందము దిద్దు కన్నె కన్నులలోన
దాగున్నదే చిమ్మిరేగు కడలి
నిండు వెన్నెలతేని నిరసించు ముద్దు మో
మున వ్రాలుగునే యేడు పసెడి మొయిలు

తళుకు బంగరు కింత కళ లేదె యనిపించు
చిరుమేని వాడ్చెనే చెనటి వనట
పుడమి సొమ్ముగ పేరు బడిన నవ్వుల మొగ్గ
కబ్బబ్బ తగిలెనే దెబ్బ యెంతొ
అంత చక్కని తల్లి కా యింత చిరుత
యీడు లోపలనే భరియింపరాని
దుఃఖభారమ్ము నా యను తోడు లేని
దిక్కుమాలినతన మక్కటక్కటకట!

ఒక గుప్పె డచటి బూది కరమ్ముతో దీసి
యెద కొత్తుకొను జనయిత్రి యనుచు
ఒక పట్టె డచటి బూది కరమ్ముతో దీసి
తల రుద్దుకొనును నా తల్లి యనుచు
అట నింత బూది దోయిట బట్టి కన్నీట
దడుపుచు నా స్వర్గతలమ యనును
తల నేలపై బూది దగుల నట్టిటు దొర్ల
వైచి పోయితె కాణయాచి యనును



మైనాదేవి

పసిడి యొడలెల్ల బూదిలో బడిన బొప్ప
వర్షమునసైన యడుసున బడుచు పొరలు
చుక్క మలీమస మైనంత సొంపుచెడిన
పిచ్చివేషమ్ములో నవ్వు వెఱ్ఱితల్లి

బంటు లా తల్లి నెన్నెన్నొ ప్రశ్న లడిగి
బదులు లేకుంట నాగ్రహము పొలి కరిగి
తెలియ జేయగ నాత డా దెసకు వచ్చి
చూచి యిది నానసాహెబు సుతయె యనుచు
నిర్ణయ మొనర్చి పట్టి బంధింప బోవ-

"అన్నా! మ్రొక్కెద - తాళు - మీ యనద నా
యాసింప బో కిప్పుడే—
అన్నన్నా! నను గన్న దేవళము - నా
యానందవైకుంఠమే
సున్నై పోయిన, దింక నా బ్రతుకు లే
శూన్యమ్ము: మున్నీరుగా
కన్నీ రొల్కగ నేడ్చి వచ్చెద - త్వరగ
గావింప కో పుణ్యుడా!"

అని ప్రతిమాలు దీనహృద
యగ నిరసించి కఠోరచిత్తు డౌ
క్షణము తగిర్చె లేజిపురు
కన్నను కోమలమైన కేలుదో
యిని కఠినంపు సంకెళు - లి
కెంతటి జాగును సేయ కప్పుడే
కొని చనె కోటలోపలకు
క్రూరుడు కన్నియ నేమి సేయనో

ఆ కోటలో బంటు లా కట్టె నీ కట్టె
నొక్కచో ప్రోగువేయుచు రదేల
ఆ ప్రోగుచుట్టు తా మాశ్చర్యజడు లౌచు
మూగిరి జను లంత మూక యేల
ఆ మూక మూక క న్నార్పకుండని చూతు
రా కట్టియల పేర్పు నట్టులేల
ఆ పేర్పునకు బంటు లగ్గని దగిలించి
అంత మంటను రగిలింతు రేల

అట్టి మంటకు నాలుక లన్ని యొల
ఆకొనిన యట్టు లా మంట లార్చు నేల
అమ్మ అమ్మా యటన్న దా యబల యెవరు
అగ్నికుండాన వైచి రా యబల నయ్యో!

ఔరా భారతభాగ్యలక్ష్మివగు మై
నా! నీకు తోబుట్టుగుల్
లేరా? నిన్ను దహించు గుండె లవి జా
లే? యీ విశాలంపు హిం
దూ రాజ్యంబున నీ యమాయికపు ని
ర్దోషంపు లేబ్రాయపుఁ
స్త్రీ రాస్యమ్మును రక్షసేయ నొకడుఁ
సిద్ధమ్ము కాలేదటే?

ముప్పదికోట్ల సోదరులు
మూలుగుచుండియు చెల్లి! నీకు ఈ
తిప్పలు తెచ్చిపెట్టిన వి
ధిఁ మొదలంటగ నూడదీయలే

దప్పటికే యనాథ, లటు
లైనను నీ యపరంజిదేహ మా
గప్పన మందు మంటల క
కారణ మాహుతి యాట కోర్చిరే

భారతరక్తబిందువు పరి
పంచమునం దెవ డొందియున్న నా
వీరకుమారకుండు మృతి
భీతికి లోగడు, పందయై జలం
బూరెడి కన్నులన్ గనడు
ఊరక రాయివలెన్: జ్వలత్ క్రుధా
పౌరుషముల్ జెలంగ నని
బడ్డ పడంతుక లెంద ఱీ స్థలిన్!

ఒక్కొక డొక్క సింగముగ
నొప్పగలా డగుగాని దుర్విధిన్
జిక్కెను; వీరవహ్ని మతి
చెడ్డ ఒడళ్లను దాగి క్రుగ్గు చే

దిక్కును లేక యేడ్చు; బ్రకృ
తిక్రమ మెన్నడు చేతి కందు- నా
చక్కని వేళ భారతని
జప్రభ లేరు రుచింతురో తుదిన్

తల్లీ ! నీ హృదయమ్ము భుగ్గురను దీ
ప్త జ్వాలలం దెట్లు ఘో
షిల్లెం బో— అది యూహసేయుటకు ని
ర్జీవుండనై సిగ్గు ప్రా
పిల్లన్ కన్నులు మూతు; కన్పదును దే
వీ ! ఘోరదృశ్యమ్ము : మే
నెల్లన్ ఝల్లను; గుండె రాపడును : ని
న్నిక్షించి ర ప్డెట్టులో !

నీపయి పంచప్రాణములు
నిల్పి పవిత్రపు ప్రేమ దుగ్ధముల్
ద్రాపుచు తల్లిలేని కొఱతల్
సమయించిన నీదుతండ్రి తా

నే పరభూములందు చరి
యించునో కాని యిదే ప్రవృత్తి నే
ఆ పురుషుండు విన్న ' తన
యా ! ' యను నాలుపు తోనె ప్రమందడే !

పాపులు త్రోయ నెత్తుకొని
పాపకు డాపెను కుక్షిలోనికిఁ
జేపడ దీసి ' తల్లిరో ! వి
శృంఖల మీ తల, మింక నీవు - ఏ
పాపుల పీడ లేక - సుఖ
భావినివై నిదురింపు ' మన్నటుల్
దోపగ భాగ్యలక్ష్మి కను
దోయిని మూసె గృశాను కీలలఁ

ఎత్తిన వేయి చేతుల నొ
కే పరి పాపకు దప్పలించి తా
నొత్తుకొనెఁ గుమారిని ని
జోదరమం : దొక రెప్పపాటులో

 

మెత్తని లేతమై మిసిమి
మిన్కులు మాసెను, లీనమొందె నా
మృత్యున ముద్దుబిడ్డ; యిక
మృగ్యము చిక్కిన ధూళి నేదియో -

వెనుకటి యుగాన దేవకీవనిత చేతి
బిడ్డ నాబిడయన్న పై విసరినపుడు
వింత యాకృతితో నది విశ్వమందు
నిలచి పలికిన పలుకు ధ్వనించె ననగ

ఆ పసియాత్మ పై కెగసి
యాకస మంతట నావరించె నే
రూపము లేకయే : కనగ
రోదసిలో నొక క్రొత్త చాయ లే
వో పయికొన్న యట్టులు - ప్ర
బుద్ధము భారత మానె. యన్నటుల్ -
ఈ పతనమ్ము నిల్చి భరి
యింతురె, లెం డికనైన, యన్నటుల్ -

అంజలించిన దోసిళ్ల నశ్రువారి
తర్పణము లోడ్చి గగురెత్తు తనువులందు
క్రొత్త సందేశమును నింపికొనియు జనులు
మూగియుండిరి కర్తవ్యమూఢులగుచు

హేదొరకు వచ్చె నప్పు డదేదొ తంతి
తీసి చూడగ క్యానింగు వ్రాసినదియె
మంత్రిమండలి 'మైనాకుమారి నేమి
యనవల' దటంచు క్షమియించి నట్టి వార్త

ఇది యొకగంట ముందు లభి
యించిన, నింతటి ఘోరహత్యకా
మృదులత మాడిపోక చివు
రించిన నవ్వుల లేత మొగ్గలన్
సదమదమౌ నెడందల కొ
సంగి విషాదపు కాలకూటముల్
బొదలగ నీక చల్లని ప్ర
మోదసుధల్ గురిపించి యుండునే!

అవసరము తీఱి యసువులే యాఱినపుడు
అమృతవర్షమ్ము గురిసిన యట్టి ప్రేమ
జూపినది మంత్రిమండలి శుష్కమయ్యె
యశము దక్కదు మాసిపోననియె మచ్చ

# ఉత్తరమ్

నానాఆత్మజ నా సుమాలసను
మైనాపుత్రి నా మంటలం
దానా డట్టులు నింపుప్రాణముల ద్రో
యః గుండెలా ఆంగ్లసే
నానుల్ వేపురకైన నాడచట్టు తాం
త్యాటోపియే యున్నచో—
లేనేలే డత డేడ కేగనో కుమా
రీ భావ భ స్వాంతుడే!

[౮౨] మైనాదేవి

బాలిక భస్మమైన విష
పన్నగసన్నిభసాంధ్యవేళ చిం
తాలుడితుండు కోటగడి
దాటి క్రమమ్ముగ రామపాలు డా
త్మాలయమందు జేరి త్రుటి
మైన చనంగను లేదు:- చూడ నే
వ్రాలును లేని లేఖ నొక
పాంథు డొసంగి చనంగ దానిలో

— లేఖ —

" ప్రియ రామపాలసింహునకు -

అవసరములైన కొన్ని కార్యముల
గురించి ♦ ఢిల్లినుండి వచ్చితినిదే—
డిల్లపడక ♦ నేటిరేయికి నడిజాము
దాటుతరికి ♦ రమ్మొకడ వీవె
భగ్నసౌధమ్ము కడకు
శుభకాంక్షి సన్యాసి - "

అనిపరియించి 'ఎవ్వడిత'
డంచు గడుంగడు చింతసేయు, 'ఢి
ల్లిని విడి వచ్చె - సంశయము
లే దిత డౌను తాంతియా'
యను - 'సది శత్రువుల్ సలుపు
నట్టి వినూతనతంత్రమో కదా'
యను - 'నెట్టులైన నే నచట
నాతని జూచుట పాడి యా' నను౯

ఇక సందేహము లేక పో ద్దలపుతో
నే సిద్ధమై మధ్యరా
త్రికి భగ్నాలయ మున్న చోటునకు జే
రె౯ రామపాలుండు - - ఎం
తకు లే దెవ్వరి జాడయేని, విసు గె
త్తె౯ బోవ నుంకించు వా
డు కనె౯ నాలుగు దిక్కులొక్కపరి చు
ట్టు౯ - అంత నొక్కమ్మడి౯

 

కూలిన కుడ్య శేషముల
కూడి నడంగిన రాజసౌధపుం
వాలక మెట్టు లాంగ్లులకు
భ్రాంతిదమై తనరారెనో తదీ
యాలఘు శిల్ప మాత్మగత
మయ్యె; జనించెను భక్తి భావ; మా
ప్రీలిన మేడరా ళ్లతని
వేలుపు లైనటు లెంతో నమ్రుడై

ఆస్థలము చుట్టు తిరుగుచు ''నక్కటకట !
కాలగతిలోన నింత వక్రిత తటస్థ
మగునె కనులార చూచుచుండగనె!'' యనుచు
నొకదెసకు జూచి యనుమాన మొందె నేమొ

ఆ విమలంపు చంద్రికల
నచ్చపువెల్గున దూరమందు నే
వేవియొ చిహ్నముల్ మనుజు
డే యను నట్టివి తోచినంత, తా

నా పలుకే కరమ్మున త
యూరుగ నుంచిన పిస్తు లెత్తైదుర్ -
వే విడువంగబోవు గతి
వ్రేళుల బూన్చి నిరీక్ష సేసెదుర్

జటలు ధరియించి యొడల భస్మము నలంది
తనవెసకె వచ్చు కాషాయధరుని జూచి
'మిత్రులో శత్రులో ముందు మీర లెవరొ
నుడువవలె' నన్న; యోగి 'మిత్రుడనె' యనియె

ఆ వర్ణత్రియమందు పెర్ వెలలె మ్రో
యర్ 'తాంతియాటోపియే
యీ వేషమ్ము ధరించి వచ్చె' నని యూ
హించెర్ - యథార్థ మ్మదే, -
ఆవేశించిన భక్తి నప్పుడు ''మహా
త్మా! నన్ను మన్నింపుమా:
మీ వృత్తాంత మెరుంగ లేక యిటులర్
మేకొంటి. నార్యా'' యనుర్

 మైనాదేవి

తిరుగు జబాబు లే దత డ
దేపని జూచును మొండిగోడలన్ —
తెరచిన నోరు, విచ్చిన క
నుంగవ, యెత్తిన కంటిబొమ్మలున్,
దొరలని శ్వాస - యిట్టులు వి
నూతనలోకము జూచురీతి ఎ
బ్బెటికపు తీఱులన్ గనును
పిచ్చిగ పిచ్చిగ తాంతియా కటా!

అతని యెడందలో గలుగు
నట్టి గతస్మృతులున్ భవిష్యదర్థ-
తుములభాసనల్ వెలికి
రావని గాని, తుపానువేళ రే
గు తరగ లంబుధిన్ వలె ప్ర
కోపితు జేయును లోన లోన, —
'ఈ గతి విధి వ్రాసె చూడు'
మనగా పడియేడ్చెడు మూక కుడ్యముల్;

అంతర మెల్ల నొక్కపరి
యాహుతి గాబడినట్లు, అంపెతో
సుంతలుగాగ కోయబడు
చున్నయటుల్, భరియింపరాని ప్రా
ణాంతకమైన వ్యాధికి ల
యమ్మయి పోవుచు నున్నయట్లు,-
'శుద్ధాంతము లెన్ని రూపఱె నహా'
యని తాంతియ చూచి చూచియుఞ్

" తెలుపుము రామపాలుడ! గ
తించిరొ యిట్టులె నానసాహెబుఞ్
లలితశిరీషకోమలవి
లాసిని యాతని ముద్దుబిడ్డయుఞ్
విలులితదేహులై - తెలుప
వేమి - అయో - లయమొందిరా సఖా?
ఇలపయి వారిలోన నొక
రేనియు దక్కిరటంచు దెల్పవో"

అని యడుగువాని కాత డేమనగవలెనో
'త్రోయబడె నగ్నిలోన మైనా' యటంచు
నెటుల వినిపింపవలెనొ సంకటముపడును;
తెలిసె ననుకొన్న దుర్వార్త తెలియలేదు.

పలుకకుండిన యా రామపాలుతోడ
శాంతియా యనె మిగుల నాత్రము చెలంగ
" ఏమి - చెప్పవు - ఆంగ్లేయు లింతవరకు
తెగడి మైనాను పట్టి బంధించరు కద ? "

అప్పు డా రామపాలు " డాయమ పవిత్ర
దేహవిద్యుచ్ఛిఖఁ - దాకు ధీవిశాలు
డెవ్వడును లేడు లే " డను చేవ యాత్మ
పరమునఁ జెప్పె; శాంతియా యెరుగ దద్ది

" మఱి యెచట నుండు మైనాకుమారి యిప్పు "
డనియె వేవేగ జూచు పేరాసతోడ :
" అకట ! వచియింపజాల నాయమ విషాద
భయదవృత్తాంత " మని రామపాలు డనియె.

తొలుత మొలిచిన ధైర్యంపుమొలక యిపుడు
మాడి మసిగాగ నిలువని మనసుతోడ
పడిగె "ఏమి - ఆ రాజకన్యక జగత్తు
విడిచియే పోయెనా" యని వడిగ వడిగ

"పోయిన దా సుమ మ్మసుర
భూముల వీడి నిలింప పుణ్యాపూ
జాయతనమ్ములో జరుగు
నర్చనలందు నిరంతసౌరభ
శ్రీయమధూత్కరమ్ములు వె
సన్ విరజిమ్ముచు నిర్జరాళికిన్
ధ్యేయపదార్థ మాట" కని
తెల్పక తెల్పెను రామపాలుడున్.

గగనవనీవిహారి విరు
గంబడి నవ్వెను చందురుండు సొం
పెగయగ చాతకాంగనల
కిచ్చు సుధాసవశీకరంబు, లిం

పుగ వలపించు, ప్రేమరస
పూర్ణకరమ్ముల బుజ్జగించు, లీ
లగ గమియించు కాలము వ
లంతలులేని మహాసుఖమ్మగా.

అదియే వేళకు తాంతియా హృదయమం
దారార! రక్తస్రుతుల్
భీకరాఘాతపరంపరల్ లయకళ
భీభత్స భిన్నార్భటుల్ –
ఎదియో చీకటికోణమై ప్రకృతి, అం
దేమున్నదో తాంతియా
హృదయం బింత యెరుంగలేని జడవృ
త్తిన్ బుచ్చె నెన్నో త్రుటుల్

తాంతియాటోపి తనదు తత్కాలదశను
తిరిగి గురితించి విషయము నెరుగ నడిగె
"ఎవ్వ డా గుప్తపథవర్తి యిట్టి గతికి
తెచ్చె నోర్వక రాజమందిరము దీని"

" ఆంగ్లమంత్రు లొసంగిన యాజ్ఞవలన
జనర లాట్రాము సేనతో సాగి వచ్చి
మరఫిరంగుల ప్రేల్చి యీ మహితసౌధ
రాజమును గూల్చె మదిని నిర్దయ వహించి "

అపు డనియె తాంతియా వింతయక్త్రమున
" ఆ విషపువేళ రాజసౌధాంతమందె
వేరువిధిలేక మైనాకుమారి చిక్కు-
బడియెనా యేమి ఓ రామపాల సింహ "

" వినయవతి శోకమున నెంతో వేడుకొనియె
గాని వినలేదు నరపశువైన యతడు
మంత్రులవచస్సునే గొల్చి మంట గలిపె
నానసాహెబు స్వర్గ సుందర జగత్తు "

" అట్టియెడ నా శతఘ్నికా వ్యగ్రవహ్ని
శిఖలకాహుతి యయ్యనే చివురుకన్నె ? "
అని ప్రకంపిత గాత్ర విహ్వలుడు పృచ్ఛ
సేయ రామపాలుడు వచించెను గత్తారి.

" సౌధము భగ్నమయ్యెడి వి
పాదపు వేళ కుమారి యేడకో
బోధము కాని మార్గమున
బోయిన - దెవ్వ రెఱుంగ ; రే మనో
వ్యాధి కలంచెనో అచట -
నామె యొకానొక మధ్యరాత్రి ను
ర్వీధరధీరయై ధరణి
వ్రీలిన గోడల ధూళి చెంగటన్

చేరి " నా స్వర్గధామమా! నారమాధి
వాసమా! నా వికుంఠదివ్యాలయంబ!
విలయ మొందితివే నన్ను వీడి " యనుచు
గోడుగోడున నేడ్చెను గుండె లవియ

అటకు చేరువలోనున్న యాంగ్ల సేన
వినియె నాయేడ్పు: ఔట్రాము పిదప వచ్చె:
'లభ్యమయ్యె నికన్ వీడరా ' దటంచు
పట్టుకొనెను కుమారి నర్భకను ఖలుఁడు "

'అక్కటా!' - హా విధీ!' యను చరణమై స
మస్త దేహమ్ము రుధిరాన మఱగినట్టు
లగుచు శాంతియ తన పాణియుగమునన్ క
పోలతలముల గన్నుల మూసికొనియె

కొండొకసే పత డట్టులె
యుండెను, మొగమెత్తి పిదప "నో చెలువ విపత్
ఖండము దాటెను తొలి: యీ
దండకు తను గాన రా గతంబెది మరలన్"

"అన్న! ఆదేవి యాత్మసమర్పణమ్ము
జేయ దల పోసి యేమొ వచ్చినది మరలి
మాతృతలము నిలింపధామమ్ము దగ్గ
మైన నాకేల జీవిత మనియె యేమొ"

అని రామపాల సింహలుం
డన విని భయభక్తి నమితుడై యొడలు గగు
ర్పిన వణకెడి కంఠముతో
నన "నాట్రా మెట్టి శిక్ష నాయమ కిచ్చెన్"

" అది వచింపగ నాజిహ్వ కలవి గాదు
ప్రళయకాలాగ్నిరుద్రనర్తనమె నాదు
బ్రతికి యుండియు జీవచ్ఛవమ్మొ జగతి
ఎద పగుల దేల దృశ్య మూహించు వేళ "

వేల నతిక్రమించెదు గ
క్షీరసముద్రజలమ్మటుల్ క్రుధా
క్షాళిత ముష్ణరక్తము ప్ర
కంపితమై తనువొక్క వల్మిక
వ్యాళముపోల్కి పొంగ, కర
వాల మొఱన్ విడ లాగి, కన్గవన్
రాలగ నిప్పుకల్, పెదవి
నాకుచు శౌర్యపయోధి తాంతియా -

అనియె సహియింపరాని రయమ్ముతోడ
" ఆ హృదయహీనుఁ డే శిక్ష నామె కిచ్చె ?
ఎఱ్ఱ మొనర్పక వచియింపు మిక మదీయ
చండఖడ్గమ్ము లయకాలసర్ప మోయి ! "

" ఆ లతకూనను దుష్టుడు
జాలి యనున దింత లేక జ్వాలదగ్నిశిఖా
జాలమునన్ బడవైచెను
కాలి మ్రందె నిందుపాణి కర్కశము సఖా "

'హా - మైనా-' యనె శాంతియూ...అతని ప్రా
ణాంకూర మెందేగెనో
ఆ మూర్తమ్మునయందు, - రూపజెన వా
యాక్రోశమం దెన్ని యూ
హా మాధ్వీక పయోధులో, - మధురభా
వానందసౌధమ్ములె
న్నో, - మున్కొన్నవి యెన్నియో వ్యధలు,-బా
ష్పోల్లోలకల్లోలుడై

" ధర్మదేవత పుట్టిల్లు : కర్మభూమి :
శాంతి, సత్య, మహింస, సంచరించు వీధి :
హైందవక్షోణి ! ఇట నింత యూసురోద్ధ
తోగ్రచండనాట్యమ్ము మీ రొర్చినారె ? "

సిగ్గు దహియింప గన్నీరు చిందిపాఱ
వ్రేలవైచి తలన్ రామపాలు డనియె -
" ఆ పసిడికొండ దక్కుటకై పథమ్ము
లెన్ని త్రొక్కియు విఫలతయే లభించె:

కాని యనంతరమ్మున న
కాంక్షితమై లభియించె తంతి ' మై
నాను క్షమించినార, యిక
నాతి చెఱన్ విడిపింపు ' డిద్ది మా
యానతి ' యం చమాత్యవరు
లంపిన వార్త విలాతినుండి - ఆ
లో నొక గంటముందె యిహ
లోకము వీడె కుమారిప్రాణముల్ "

" ఏ సురలు తండ్రికొమరిత లెసగు వేళ
గ్రాలె నమరావతిగ కాన్పురమ్ము ; వారు -
నానసాహెబు మరియు మైనాకుమారి -
లేరు: నాపాలి కిది యింక ప్రేతభూమి

ఆరిపోదేమి నా జీవికార్చి ? యింక
కోరు నేది నిరర్థకగోత్రయందు ?
ఏది నా భావమధురసాంద్రదేక్షువణము ?
ఏవి యేవి – దిశల్ కానరావ వేల ?

అది యధీరుని లక్షణ మటులు వలదు
అసువు లీ భాండమున వెల్గు నంత వరకు
నా మహాదేవి కపరాధ మాచరించి
నట్టి వారి నిర్మూలింప నరుగువాడ "

అనుచు పోబోవు తాంతియా నాపి రామ
పాలసింహుడు గద్గదస్వరముతోడ
నడిగె దీనమ్ముగా " మహాత్ముడ! ఇచోటు
వీడి మీరేగెదరు ముందు కేడ " కనుచు

" చెలుడా! నే నిపు డీ స్థలిన్ విడిచి కా
శీక్షేత్రమున్ జేరెదన్,
కల దచ్చోటున మామసేన, జరుగం
గా బోవు పోరాట మాం

గ్గులతో నింక, జయమ్ము కల్గునని నా
లో నాత్మ ఘోషిల్లు, రా
గల దెంతో నృపవర్గ మయ్యెడల రం
గంబంను మాతోడుగన్ -

జయమే కూడక పోయెనా భరతరా
జ్యశ్రీకి నీమధ్య రా
దు యదార్థమ్ముగ స్వేచ్ఛ: యిద్ది భగవత్
సూక్తమ్ముగా నమ్ము మో
యి ! యెటుల్ గూడునో కాని - నామటుకు నే
నిచ్ఛామతిన్ పోరులో
లయమై పోయెద మాతృముక్తికయి హా
రాహారి పోరాడుచున్ -

ఈ శరీరమ్ము సాధించు నేది యింక ?
ఆ పవిత్రాత్మ స్వర్గస్థమయ్యె దేని
నిచ్ఛగించెడి నిధిగాక ? ఇంతకన్న
నాకు వేరొక్క విధి కడదాక లేదు"

" ఎంద ఱున్నారు సైనికు ? లెంద అవని
పాలకులు నాడు మీకు తోడ్పడెడి వారు ? "
" సేన పదియారు వేలు మించినది మాది -
కలవు రాజుల సేన లింక నొక కొన్ని :

అది యటు లుండనిమ్ము చెలు
డా ! యిపు డొక్కటి యంత్యకాంత నా
యెద దహియించుచున్న ' దది
యింత దయామతి నాలకింపు : మా
మృదులత మాడిపో మిగులు
మృత్తిక గాలికి రేగుచుండు నీ
యదనున నంత లభ్యమగు
నన్నది యాశ, పథమ్ము తీయుదే

రామపాలుడు నా వెంట రమ్మటంచు
నడువగా ముందు శాంతియా నడచె వెనుక
చేరి రాపైని మైనాకుమరి యెచట
బూదిగా మారెనో ఆ ప్రపూతతలము

చేరి, చేరగనే భస్మశేషమునకు
శాంతియూటోపి చేసి ప్రదక్షిణములు :
ఎడతెఱపిలేక యశ్రు డెన్ని యెన్ని వెడలె
నతని హృదయమ్ము పగిలి హాహారవములు !

" ఓ పరమపావనీ ! నేను నీ పవిత్ర
పాదసవిధమ్మునకు వాలి ప్రతిన నాకు
కలదని యెరుంగవో - మున్నె తెలుపలేదె ?
వచ్చితిని, యేది నీ పాదపద్మయుగళి ? "

ధీరుడు వీరుడే మరియు
తీక్ష్ణమనస్కుడె గాని శాంతియూ
పారములేని శోకపు ప్ర
వాహములో బడిపోయె, నెట్టిదో
వారల బంధుభావము: ప్ర
పంచము నాడె లయమ్ము నొందిన
ట్లూఱట లేక నేడిచె న
యో శిలలేని ద్రవించి పోవగా

భీకరమ్ము కఠోర మూర్తిధరమ్ము
కాని యా గుండెలో దాగె కరుణజలధి
ఎడతెగక రేయిపవలును బడుచునుండు
స్వచ్ఛజలపాతము ప్రబలసాక్ష్యముకద

ఒరసియొరసి తటమ్ములు పొరలి పొంగు
వాహినీనీర మది యెంతవరకు చనునొ
అంతవర కది చనియె ప్రశాంతి నొందు
సహన మలవడ నీలోన సమయ మేడ

వేడి వేడి కన్నీళుల వెడలబుచ్చి
గాలిచే లాలితమ్మగు కన్నెబూది
నింత గైకొని గుండెలో నిమిడి యున్న
క్రోధవహ్ని జ్వలింప బ్రకోపియగుచు

“ దేవీ! నీ చితిభూతిలో మొలిచి మా
తృస్వేచ్ఛ సాధింప నె
న్నే వీరాత్మలు జొమ్ములిచ్చుటకు నే
డే లేచివచ్చున్ దివ

మ్మే వాంఛించి – తదీయకోపలయవ
హ్నిజ్వాల లిచ్చోటనే
ఆవిర్భూతము నొందగావలె రణ
వ్యగ్రక్షుధారంభముల్

నీకు జరిగిన దుస్సహానికృతి కింక
తగిన ప్రతికారమును సల్పు దండిమగల
రోషభీషణఘోషఘోరప్రచండ
వేల్లనముచేత పృథివి కంపిల్లవలయు

రూ పది మూసె, నైన పర
రూపము నీది సమస్త భారత
త్యోపరిపూర్ణమై సమర
ఘూంటికమై – విజయావబోధవే
ళాపరిరంభ మూసగొని
రక్తము ద్రావెడి వీరకోట్ల కె
ట్లో పొడకట్టి లో వెలుగు
లో జ్వలియించును లెమ్ము లెమ్మికన్

*

జననమిచ్చి పోషించిన స్వర్గ భూమి
పుడమి తలమానికమ్మగు పుణ్యభూమి
పడగరాని చెఱల్ బడి బడలు చుండె
'లేరె కొడుకులు' అని నిద్ర లేప వలయు
లెమ్ము లెమ్ము
మైనా దేవి
లెమ్ము లెమ్ము

*

తల్లి ఋణమున బడి తేనె ద్రావు నెవడో
మాతృసేవకు రాని సోమరి యెవండో
అట్టి యెడదల నెత్తురు బొట్టు దీసి
యిది భరతరక్తమని తెల్ప నేగవలయు
లెమ్ము లెమ్ము
మైనా దేవి
లెమ్ము లెమ్ము

*

ఇది యొక లతాంగికే మైన హింస కాదు
ఇది నిఖిలభారతీయుల కీయబడిన
ప్రకట విద్రోహ కృతక పరాభవమ్ము
మానధను లెవ్వరని వీరమతి జగుర్ప
లెమ్ము లెమ్ము
మైనాదేవి
లెమ్ము లెమ్ము

*

ఓర్పుగల తల్లి తనవార లొరు లటంచు
చూడ కిల్లిచ్చి నిల్వ నిచ్చుటయె ఘోర
పాపమై తల్లి పడరాని పాట్లు బడును
వెర్రి బిడ్డల కిది తెల్పి వేగ బిలువ
లెమ్ము లెమ్ము
మైనాదేవి
లెమ్ము లెమ్ము

*

పరులు చూపెడి మెరలకు బ్రమసిపోయి
ఒరగి పడియున్న జననిపై మఱపుగలిగి
స్వార్థకూపాంధతమములో సంతసిల్లు
భరతసంతతి కొక భక్తి గఱపవలయు
లెమ్ము లెమ్ము
మైనాదేవి
లెమ్ము లెమ్ము

*

దైవనిలయము భారతధర్మశాల
ఇట ప్రసాదము తీర్థము నింత గొనియు
మ్రొక్కి వెడలక గుడి గూల్చు ముష్కరులను
జూపి స్వామికి కోపము రేపవలయు
లెమ్ము లెమ్ము
మైనాదేవి
లెమ్ము లెమ్ము

*

తల తలకు పెత్తనమ్ముగ తగవులాడి
అన్నదమ్ములరే మీరు భిన్నులైరి
ఇల్లు దూరి పరుల్ మీకె యెసరు వెట్టి
రిది యెరిగి కూడ రారు రారేల యనగ

లెమ్ము లెమ్ము
మైనాదేవి
లెమ్ము లెమ్ము

*

స్వేచ్ఛలేని సుఖ మ్మేమి, జీవ మేమి
జుట్టోరుల కిచ్చి వ్రేలాడు సుఖములోన
నవ్వుకొనెడె నికృష్టుడా! నను మెట్టి
రంగమున దూక వే మను రవళిగొలుప

లెమ్ము లెమ్ము
మైనాదేవి
లెమ్ము లెమ్ము



తగిన శూరుని నాయకత్వమున కొప్ప
సమరసంసిద్ధులై రండు జాగు వలదు
వలదు బహునాయకత్వ, మెవ్వాడు మేటి
వాని కెదురాడరాదని పూని చెప్ప

లెమ్ము లెమ్ము
మైనా దేవి
లెమ్ము లెమ్ము

ఎవరితో బల్కుచుంటి నే నింత సేపు
ఎట గలపు దేవి ! అగ్నిలో నటమటించు
చెంత ఘోషిల్లితివో ? శౌర్య మెంతగలిగి
వ్యర్థులము మేము నిన్ను గాపాడ లేదు

మాడిపోయితివే సుధామధుర వాణి !
కాలిపోయితె నీలమేఘప్రవేణి !
బూదిగా మారినావె నవ్వుల వలంతి !
దగ్ధ మొనరించిరే తటిత్ కనకగాత్రి !

అంతమైనది నీవు కా, దఖిల భార
తీయగౌరవసంపత్తి: మాయమయ్యె
భారతీయాభిమానదివ్యత్పతాక,
నీవు కాదు: నీ వమరవు దేవి! నిజము

వెలితిలేక నిండిన నీదు విశ్వరూప
మెవ రెరుగనేర రవ్వారి కీ శ్మశాన
వాటియే పుణ్యతీర్థమై వఱలగలదు
దేశకాలభేదము లేదు దేవి నాకు

కోప పడబోకు మో దేవి
నీ పవిత్ర
భస్మరేణూత్కరమును నా
పాణి తాకి
మైల పడవైచె సని: నాదు
మనవి వినుము –
శాంతియాటోపి వీడు నీ
దాసవరుడు

*        *

*

ప్రాణ మ్ముండెడి దాక స్వేచ్ఛకయి, సం
గ్రామమ్మె జీవమ్ముగా-
ఈ నీ భూతి మదిష్టదైవముగ- నే
నే యుద్ధమం చున్న మై
నానామస్మరణమ్ము సేయగల నం
తగ కాలముగ దీక్ష, దే
వీ ! నీదాసుడు నీదు భస్మమును పృ
థ్వీగర్భముం జేరెడిన్"

*

*        *

*        *        *

*        *

పిదప౯ - ఎందఱు నానసాహె బితడే
వీడే యటం చాంగ్ల దు
ర్మదసేనానులు పట్టి వధ్యశిలపై
ప్రాణమ్ములం దీసిరో -
తుదకైన౯ లభియించెనో అతడు, లే
దో - శాంతియా కే గతుల్
బొందవె౯...ఏమొ - వచింప నేటికి
కథాలోల ప్రపంచమ్ములో

*        *

*

*

పండిత సుదర్శనుకు
ప్రతివాని స్వేచ్ఛానువాదమై
'రాజయితే నేమి' అను శీర్షికతో
౧౯౩౯ లో జనవాణి జన్మదిన
సంచికయందు వెలువడిన కథయే
యీ రచనకు మూలము -
అందలి భాగస్వాముల కెల్లరకు
నా కృతజ్ఞత.

౧

అతడు బలశాలి జనహృదయాపహారి
రిపునికరమానహారి ముద్రితదిగంత
కీర్తివర్ణుడు 'పాంచాలకేసరి'గ బ్ర
సిద్ధి నొందెను రణజితసింహు డతడు

ఎరుగ డొక వీధిబడియును
గురువరు నెవ్వారిని జేరి కొలువ డతం డే
కరణి ధరణి బాలింపగ
నురుతరనయవేత్త యయ్యెనో తెలియదుగా

నలువది హాయనమ్ములు జ
నమ్ముల కిమ్ముగ పాలన మ్మన,
ర్గళముగ జేసె, శిక్కతడు,
గండరగండఁడు: వాని పేరనఁ
బులిని స్మరించి నట్టులగు
భూపుల కుత్తరభారతాన, నాం
గ్లులకును కాబులీలకును:
కోరెద రెల్లరు వాని చెల్మినే

కాబూలీరుధిరమ్ము ఝుల్లుమనగా
కఁపిల్లి తద్దుర్గమూ
లాబంధమ్ములు నూఁగులాడఁగ రణా
వ్యాసక్తుఁ డయ్యెఁ జితో
ర్వీబాధోర్వశిఖామ్మయుండగుచు ని
ర్వీర్యప్రజారక్షకై
తా బృందిష్ఠవరిష్ఠశీతలకృపా
ర్ద్రద్రష్టయై వర్తిలుఁ

తద్రిష్టక్ష్ణుతధార భీకరబృహ
ద్ధాత్రీధరం బానో పృ
ర్వోద్రేక ప్రచలద్రవఃషోర్మికల రం
హోద్దీప్తి చల్లార శ
త్రుద్రాఘిష్ఠసరిత్కదంబ మచల
ద్రుస్థ్గాలరించ్ఛోళిగా
'భద్రం తే రణజిత్ సువీర భవతు
స్వస్త్యస్తు తే' యం చనుఱ్

ప్రకటప్రోద్ధతపర రా
ణ్ణికర వ్యాపాదనోగ్రనిర్ణిద్రబల
ప్రకృతులు హూణులై తత్క్రుద్ధ
నోక బాడబశిఖిగ భీతి నొందెదరు గదా

అత డంత సుందరుడు కా
డత డొక యాజానుబాహుడైనను కాడే
అతడొక్క పొట్టి మానిసి
అతనికి జగమింత జడియు టది యొక దశయే

రాజ్య ముద్యాన మత డగరాజి నేలు
తోటకాపరి పాలితద్రుమలతాళి
హర్ష సుమవృష్టి నొల్కు- ననారతమ్ము
త్రిదివవనశోభ భువిని బొందిన దనంగ

అతని సంకల్పానుగతమహారంభజా
స్తోకసిద్ధ్యంతభల్లూకదీక్ష
అతని జగజ్జీవనాధ్వసరసూత్రాయ
మానదైవీభక్తిమద్దిదృక్ష
అతని మూఢజనతాహమ్మతిదళనసం
సిద్ధకరాళవాణీబుభుక్ష
అతని రాష్ట్రప్రజాహ్లాదకైంకర్యసం
భూతభూరిశ్రమభృత్తితిక్ష
కలసి యాతని పావనాఖ్యను సువర్ణ
దివ్యదీప్తాక్షరములఁతో తీర్చిదిద్దు
జగదతులకీర్తిమద్రాజశంసనప్ర
ణాదచారిత్రకప్రబంధమ్మునందు

జలజలపూలు రాల, పువ్వు
జప్పర మొల్కాడి హాయిలో వెతల్
తొలఁగ, తలంపులన్ జవ్వులు
లోఁకక రేఁగడి వేళ కోకిలల్
కలరవ మాలపింప, పసి
గాడ్పుల సంజ ప్రవేశమై, యెటో
తెలియక పచ్చకామిని ఁ
తిన్ బ్రభుపాలన తన్ను బాలితున్

" మతము పవిత్రము జీవ
న్మృతు డత డెవ్వాడు దాని మీఱి చరించున్
బ్రతు కతనికి తగదని తీ
వ్రతరస్ఫుటబోధ సేయ బడలదు సభలన్

ఒక తెను బెండ్లాడవలెన్
సకలము గని ముందు తనకు సరియైన సతిన్
వికృతిని గూర్చెడు యువతీ
నికరము గని తొలఁగుడనుచు నీతుల గరపున్

ఎట్టెటు శ్రేష్ఠుడు నడచెను
నట్టటులే జనులు నడతు రాతురముమెయిన్
దిట్టరియగు నృపవరు డొక
కట్టడితో నడువవలెను కని సకలగతుల్

యుష్మద్ధితకరసుపథో
గ్రీష్మసహిష్ణుండ నగుచు నొక్కట నేనే
యుష్మదహితముగ నడువన్
భీష్మమ్ముగ శిక్షసేయ వెరువకుడు ననుఁ"

తీయని తేనెలై కళలు
దీర్చిన చల్లని పండు వెన్నెలై
సోయగ మొల్కు కల్కిజడ
చుట్టకు గ్రుచ్చు గులాబిపూవులన్
హాయిగ జారి నెన్నడల
నాడుచు వచ్చు సుగంధవీచులై
పాయక నిల్చి యా ప్రభుని
పల్కులు పాడుకొనెఁ బ్రజాళితోఁ

[చ. ౨] మొరాకన్య

౨

దానిపయ్యెదకొండ్ల దడియు జక్కవకవల
బాటించు నెన్నెన్ని వేటకనులు
దాని పాంజేబుల తళుక్కుమీగాళ్లతో
తడబడు కనుచూపు జడలవెన్ని
దాని మేలిమి మేను దాగిన జిలుగు పా
వడ కెన్ని చూపులు ముడుపు లంపు
దాని కెమ్మోవిలో తడిసి చిందిన నవ్వు
కలువల కెన్ని కన్గవల పోటి

అది వయసుతోటలోపల నడుగు బెట్టి
పెట్టకున్నప్పుడే దానిపేరు పుడమి
నల్లడల బ్రాకి పోయె సౌందర్యజలధి
గాననాట్యసుధాబ్ధి మొరా నటంచు

సన్నగా కమ్మగా జాలుజాలుగ వచ్చు
మకరందధారల మాటుకో నెనో
గుళికలు గుళికలై గుటక నీరూరించు
రసఖండముల దండ రాలి పడునో
అలలైన కలరవమ్ముల సుధాంబుధిపైన
పూవుటోడ విహారములకు చనునో
మెలిచుట్టుమెట్ల గాద్పుల మేడపై కెక్కి
పోవుచు దిగుచు దో బూచు లేమొ
అనుచు నిల్లెన్ని తలపుల నైన నూహ
సేయుదురు శ్రోత లద్దాని చిత్రమధుర
మధురసంగీతకళల నున్మత్తులగుచు
అఖిలపాంచాలమం దది అగ్రగణిక

లలితవసంతకోకిలకళధ్వనిలోన
కలమాధురీకళాకళిక లేరి
కలహంసచరణమంజులమందగతిలోన
తరళితనృత్తనృత్తముల నేరి
మలయానిలాందోళచలితలతాళిలో
సముదీర్ణహావభావముల నేరి
శరదిందుశీతహాసతరంగపాళులన్
మోహనసీధుబిందువుల నేరి
పాటలో నాటలో అచ్చపాటు గొలుపు
నభియయమ్ములలో రసవ్యాప్తిలోన
మిళిత మొనరించి యువకచంచలహృదంత
రముల గదలించివైచు మొగాను సభల

అసమమైన తదీయరూపనటనా
ద్యాకర్షణీయప్రథా
విసరమ్మున్ వినినాడు రా, జపుడు ప్ర
ద్యోశానసై సర్గిక

వ్యసనమ్మెట్టులో యట్టులే ఒక సభర్
బాటించె లాహోరుఁగో -
ఇసుకన్ వైచిన రాల దా ప్రజలలో నేలా ?
మొరా వహ్వాహో !

సంపంగివిరి రేకువంపు వ్రేళులకూర్పు
సుమపాణిపుటి కొక్క సొగసు గొలుప
నెమ్మలిమెడవోలె నిలుపు కై దండలు
కళుకుకడాని నిగ్గులను దెలుప
కమ్మెచ్చు తీయు బంగరుతీగె నడుమెన్నో
భంగిమమ్ముల బరాబరిక సలుప
పారావతగళమ్ము వలె నడు గడుగునన్
దిరుగు కుత్తుక సభ్యనీతి విలుప
బొమల ముడుపులు విడుపులు పొడము సమయు
మందహాసాంకురములు విస్మయ విలాస
వివిధచేష్టలు పాటలో వెలయు కవిత
కర్థము కరామలకముగా వ్యక్తపరచు

ఆ సభలోని సభ్యహృద
యభ్రమర ప్రకరమ్ము లంగనా
హాసవిలాసపేశలక
ళాసవ మానుచు దాని పాదవి
న్యాసలయానుజల్పితకి
ణంకిణకంకణనూపురాదిభూ
షాసరళశ్రుతిప్రగుణ
శబ్దధునిన్ విహరించు కైపుతో

అది శృంగారపు ముద్దు, కెంబెదవి నో
య్యారమ్ముగా నొల్కుచు
న్నది శృంగారపు మత్తుపాట, సకలాం
గశ్రేణి బోధించుచు
న్నది శృంగారపు కమ్మవాసన, పద
న్యాస మ్మదొక్కొక్క టొం
త దయార్ద్రిమ్మో! స్రవించు నేకడకొ -
సౌందర్యమ్మొ ప్రాధాన్యమో -

కుముదాసారము దృక్ప్రసారమయినన్
గుప్తమ్ముగా వాడి బా
ణము లందుండి ప్రజాహృదాఢ్యబలసే
నానీకమున్ దాకి గ
ల్వ మహామోహారణమ్ముంగో నొరగి సు
ప్త మ్మయ్యెనో సేన శై
ల[illegible] పోల్కిన్ జలియింప దెంతయని వే
శం బాళయున్ జూడమున్

గడచె నడిరేయి యెవ్వరు కదల లేదు
దాని సమ్మోహదృష్టి ముగ్ధమ్మ మ్మృతుల
నిశిత మవ్యాహతమ్ము సున్నితపు గతుల
జరగి రణజిత్తు హృదయవజ్రమును దాకె

అత డీ లోకవు స్మతి విడ
చి తదీయత్రిదివశోభ చిందిన భావ
స్మృతి లోకము నం దెయ్యెడ
క్షః తరలి విహరించువాశా కోరిక లెవియో

ఆపి పాట మౌరాను సభాంగణాన
నిలచె నిశ్శబ్దముగ కదలని కొలను వోలె
కాని సభ్యుల కర్ణరంధ్రములలోన
గింగురనుచుండె పూర్వ సంగీతరవళి

ఒక త్రుటిలో బంగారము
తికమకగా కురిసె, రత్నదీవ్యద్భూషా
నికరము లగణితమయ్యెను
చకబికిగా దానిమ్రోల, జనపతి చూచె

3

సభ జరిగి వారమయ్యేను
ప్రభుపాణిని గొని మొరాను ప్రభ్విమె యయ్యెగా
శుభముగ శృంగారముగా
నిరువురు నద్వైతప్రేమ నుందురు నొకటగా

ఈ వివాహమ్ము ప్రజలలో నెంతయెంత
కలవరమ్ము సృజించెనో ప్రళయకోప
చండఝంఝూనిలముల నుద్దండగతుల
లేవదీసెనో- తెలుసుకోలేను వారు

కులసతి కాదు, వేశ్య: తన
కూర్మిపడంతికి మోస మిద్ది: తా
బలికిన నాటి బుద్ధుల క
బద్ధపు పోకడ యయ్యె: "ధర్మమున్
దొలగితివేని మీామదికి
దోచిన దండన మీ" మ్మటంచు మున్
బలికిన పల్కు ముల్కులకు
వాడి యొసంగిరి శిక్కు లత్తఱిన్

తను జెప్ప ధర్మమునకే
తను దప్పట ధర్మమగునె? ధరణీధవుడే
పనిగొని ధర్మము దప్పిన
జనులందు నధర్మవృత్తి సాగుట తడవే?

మతము పావన మన్న మతి యేడ కేగెనో
సానికెమ్మోవిలో జారెనేమొ
ఏకపత్నీవ్రతం బింత వాగొను బుద్ధి
వెలయాలి కడగంట దొలగినదియొ

పాలకు డెట్టులో ప్రజ లట్టు లను నీతి
గణిక కౌగింటిలో కలసి చనెనొ
మదిజలింపగజేయు మగువ జేరకు డన్న
నుడి మొరానుకు ముడి విడగ రాదొ
అని యనంతమ్ముగా బల్కి రపుడు జనులు
రాజ్యమం దెల్ల ద్వేషాగ్ని రగులుకొనియె
శిక్కునయనాల రక్తమ్ము చిందుచుండె
రణజితుని మోము జూడ రౌరవ మటంద్రు

జనులకు నాయకుండయి ప్ర
చండపరాక్రమవంతుడై సదా
రణజితు నండనిల్చి పర
రాజుల గూల్చెడి వేళ కూడి పో
రిన పులసింహులు డిట్టి విప
రీతము నోర్వగలేక కోడె క్రా
చన బుసకొట్టె సర్వజను
లాతని కోపము జూచి మెచ్చగన్

" గురుపీఠమ్ములు రణాజి
ద్వార డంపెడి కాన్కలెల్ల వారింపవలెన్
సురుచిరశిక్కుమతస్థులు
పరుసగ నవ్వాని వేరుపరుపగ

ఇటు లా 'అకాలి' పులసింహ
ములకు శాసించె, ప్రభునకు
మొదట భీతి పుట్టె జంకు పిదప ఆంధ్ర
మధిక మైనవి నిర్వీర్యుడయ్యె రాజు

" వలపుల గాలిమేడలు ద
బక్కున నేలకు గూలి పోయె నె
ట్టులు తలయెత్తి లోకుల ప
టు క్రుధ కోరిచి నిల్వవచ్చు? రా
జుల బలమెల్ల శత్రువ్రల
చొప్పున జెల్లునో యేమొ- పాలిత
జ్వాలదరుణాగ్ని రేగునెడ
సాధ్యమె జీవములేని దక్కుటల్"

అనుచు రణజిత్తు ప్రజల కోపాగ్ని గూర్చి
వారిలోని యమోఘసత్వమును గూర్చి
వివిధగతుల విచారించి వినయమూని
పిలువ నంపెను పులసింహవీరవర్ముని

భిక్షుకుఁడట్లు రా జతని
వేడిన వేఁడుటలా!- "ప్రజాసమిత్
పక్షవిధాతవోయి! పౌర
పాటు క్షమించు" మటంచు దీనుఁడై
రక్షణ గోరి కాళ్లపయి
వ్రాలగ నా పులసింహుఁడు "బ్రజల్
శిక్ష నొసంగు వా, రడుగ
జెల్లును వారినె" యంచు బల్కెఁడున్

ఉగ్రవ్యాఘ్రుసమగ్రరోషమున ము
న్నుప్పొంగ లేదే! రణ
వ్యగ్రత్వ మ్మెటు బోయె నేఁ డకట! త
త్పాంచాల సింహమ్ములో

ప్రాగ్రోచిఃప్రభ లేశమేని కలవై
రాణ్మూర్తి నిస్తేజమై
యగ్రీయత్వము పోయె, దైన్యమును హై
న్య మ్మాత్మనిఁ గ్రమ్మెఁ దాఁ

చేసిన చేతకై మిగుల
సిగ్గిలినాఁడు కిరీటదీధితుల్
మోసిన శీర్షమం దిపుడ
పూర్వపరాభవభార మూనుచున్
దోసిలి యొగ్గి నిల్వవలె
నో యని బెగ్గిలినాఁడు క్రుద్ధు లే
శాసన మిత్తురో యనుచు
శంకల గ్రుగ్గిలినాఁడు భూపుఁడున్

“ దిగ్దిగంతమ్ములందు కీర్తిని స్థిరమ్ము
గా నిలుపుకొన్న రాజపుంగవున కేని
భిక్షుకున కేని నీతి దప్పిన క్షణమ్మె
ధర్మవిధ్యుక్త శిక్షావిధాన మొకటె

అమృతసరమున నీదు శీర్షమున రత్న
మకుట ముంచిన గురుపీఠనికటముననె
నీవు తప్పు విచారింప బోదు మటకు
రమ్ము - వగచెద, వేమి లాభమ్ము భూప?"

ఇటులు పలికెడి పులసింహు నెడదలోని
ధర్మనైపుణ్యమును నీతితత్పరతను
రాజు గ్రహియించి యాశ్చర్యభాజుడయ్యె
కడిగె గన్నీట దత్పజకంజములను

"కలవె పలు పల్కు, లిది నాల్క కాదె రాజ"
యని స్ఫుటమ్ముగ 'నకాలి' యనెను: తేను
వాల్చి తల యెత్తకయె లోన నగచి వగచి
పెదవి గదలింపకయె కాలు కదపి చనియె.

౪

అంతిపురమ్ములో ప్రభుని
యాగమనమ్ము మొరాను చూచిక
ర్ణాంతవిశాలనేత్రయుగ
ళాంచితకోణములన్ దృశించి వి
భ్రాంతిని గూర్చు పోలికల
వాలికలన్ గలహంసయాన నా
ట్యాంతరమోహాసాధనల
నాత్మవిభున్ దరియంగ వచ్చినన్

పరిచితమౌ ప్రసన్నతలు
బంధుర మోహితకామిలీల లాం
తరము కరంగి పొంగిపడు
తన్మయఫేనము లేని నేడు భూ
వరుని యెడన్ గనంబడవు
పాలిన మోమున వ్రేలుచుండె భీ
కరపరితాపమేఘఫల
కచ్ఛవు లెన్నియొ నీలనీలముల్

ఏడను శూన్యమే కను ధ
రేశుని అంధకదృష్టి కిట్టి క్రీ
నీడలు గానవచ్చునె ? గ
ణించు నతం డెవియో విషాదపున్
జాడలు, చూచి చూచి 'లల
నా' యనె: నాపె 'ప్రభూ' యటంచు
మాటాడిన దే మెరుంగక ధ
రాధిపు మార్పున కాత్మ గుందుచున్

"రణజితసింహభూధవుని
రాణ తొలంగినదే మొరాన! ని
న్నెనసిన దోష మెంతవఱ
కేచిన; దెల్లి సభాంగణాన నే
వినయవినమ్రదేహినయి
విన్నపముల్ వచియించి సర్వభూ
జను లిడు శిక్ష కొప్పుకొని
సాగిలి మ్రొక్కవలెన్ అభాగ్యుడన్"

భూమిధవు డిట్లు పలుక నా పొలతిమిన్న
గుండియల సమ్మెటలవ్రేట్లు కోటి పడిన
గతి హార్ద్దుఃఖమయియయి కాంతుతోడ
ననియె "ప్రాణపతీ! దీని యర్థ మేమి"

"మతధర్మమ్ముల కేను దప్పితిని నిన్
మన్నించి చేబట్టి- 'భూ
పతి యీ రీతి చరించినందులకు నో
ర్వన్ లేము శిక్షింతు' మం

చతిరోపమ్మున నుండిరే ప్రజలు నా
యం దోచెలీ, నన్ను బం
ధితు గావింతువో - ఏమి చేయుదురో నా
తీ, - యింతకున్ వచ్చునే ''

'' ఓ సకలభూమిపాలాగ్రణీ! శిఖాస్త్ర
శత్రుమదగజకేసరీ! సర్వజనమ
నశ్చకోరశశీ! ............ ''

" చాలును చాలు చాలు ... అవి
సత్యములే యగుగాక! వార లీ
మేలిక నిట్టులే పొగిడి
రెన్నియొ మారులు, కాని నేను నా
పై లయకాలరుద్రులయి
పాడరు నీవలె : కీర్తు లెన్నియున్
జాలవు నేటి తప్పిదము
సన్నిధిలో : అవి లెక్కలేనివే ''

“ ఓ [illegible] రాజ! మహారాజ! సకలజనులు
నిన్ను నిలబెట్టి సభలోన చిన్నబుచ్చి
శిక్ష విధియింతురే పాపచిత్తులగుచు! ”
“ అగు నవశ్యము, తప్ప దియ్యది పడంతి ”

“ ఎట్టి దండన మిత్తురో యేమొ భూప ”
“ ముందు వచియింప జాలనే ముగుద నేను ”
“ వార లెల్ల మొఱానును వదలు మనుచు
నైక్యకంఠాన బలుకుచో నపుడు...... ”

అనుచు నర్ధోక్తిగా నామె యడిగినట్టి
ప్రశ్న కుత్తర మీయ జాలక క్షణమ్ము
గాఢనిశ్శబ్దుడగుచు హృత్కందరమున
వెతకువాడు లభింప దే విధముగాని

కనుల స్రవింప బాష్పములు
కామిని శోకము భోరుకొల్పగా
జనపతి మౌనమున్ విడిచి
“ దానా! భవత్ప్రణయ స్రవంతిలో

మునిగిరి: దివ్యసుందరము
మోహనమున్ భవదీయరూపవ
హ్నాని బడి లీనమైతిని గ
దే! ఒక పుర్వుగ విప్పి రెక్కలన్

నీ సరళంపు జీవితమ్ము
ణీపరిణాహము నడ్డగించు నే
యే నుడిగట్టునైన సమ
యించెద; కాని, ప్రజాళి చెంగటన్
నా సకలప్రభాపటలి
నట్టువడుఁ గదే! వారి నాలుకల్
నా సుషిమప్రమోదమక
రందకణమ్ముల నెగ్గు లాడునే! ''

అన విని మొరాను వగచుచు నడిగె నెదియొ
ప్రభువు పల్కొత్త లేదు మొరాను కిన్క
తోడ కెందమ్మికన్గవతో ట్రుచూపు
రణజితునిపైన బరపి పల్కంగ దొడగె

“ దయయు దాక్షిణ్యమును మీ మతమ్ములోన
దలచుట మహాపరాధమా ధరణినాథ!
ప్రేమ మెఱుగని దారుణభీకరోగ్ర
వజ్రములు రాజ! మీ స్వభావమ్ము లయ్యె! ”

“ కావలె నందువా యిపుడు
కామిని నా హృదయప్రసూనమున్
బావకు వ్రేల్చి అందు బడ
వైచెద - చెప్పుము - పల్కవేమి? నీ
వే విధి నా స్వభావమున
కింత కళంకము దెచ్చిపెట్టెదే?
నా వదనమ్ము గాంచుము క
నంబడు నీకె మదాత్మవేదనల్ ”

అని తన గోల జెప్పుకొను
నా ప్రభుసన్నిధిలోన నాపె భో
రున గళ మెత్తి గుండియల
లో మొగ ముంచుక నెంత యేడ్చినన్

కనికర మింత లే దతడు..

కర్కశుడే యగు నేమొ - ఏడ్వగా

జన దని యోని డగ్గఱ ద

చంచలుడై చనె భూపుడిస్సిరో.

౫

అమృతసర మది శిక్కు రాజ్యంపు నగరి
అచటి గురుపీఠిచెంత నా దఖిలజనుల
దృష్టి నెలకొన్న, దేమి విధింపబడునొ?
పుడమి జేనికి - అత డేమి నుడువగలడొ -

జేను వినమ్రుడై శిరము
వ్రేలగ వైచి సమస్త సభ్యులన్
జూడ సభాముఖాన నొక
చోటున నింద్రితుడట్లు నిల్చె సొం

పోడిన రాజుతో బలుక
నొక్కనికిన్ మనసొప్ప. దప్పు డె
వ్వాఁడొ వితర్ధిపై కెగసి
'పల్కకు' డంచు బ్రబోధసేయుచున్

కరయుగ మెత్తి నెల్లయెడ
గమ్మున నిశ్చలశాంతి బర్వ సు
స్థిరుడగు నాత డౌమ పుల
సింహుడె – భూపుని చూచి చూచి 'ని
బ్బరముగ నిల్తు వెవ్వరవు
పల్కు' మనన్ – 'రణజిత్తుడన్ మహీ
వరుడ' ననంగ – 'నియ్యెడకు
వచ్చితి వెందుకు చెప్పు?' మం వ[illegible]

ఔర విధీ ! భవచ్చటుల
యానములోఁగల అర్థ మేమొ ? దు
ర్వారపరాక్రమక్రమవి
భాసితు నొక్కని జేసి వానినే

పేరుప్రతిష్ఠలేని యొక
బిచ్చపుకూళగ మార్చివైతు, వె
వ్వారలు నిన్న గా దనెడి
వారలు వింతలు సుమ్ము నీ పనుల్

ఎవని కత్తి పఠానుల కవచములను
దూరి నిత్యాసృగభిషేకతుష్టి నొందె
ఎవని ప్రతిభాపతాక మి న్నెక్కి యాడె
అతడు ప్రాంజలియాచు 'నిందితుడ' ననియె

"నీవు దోష మ్మదేమి రంజితుడ తెల్పు"
మనగ "పెండ్లాడితిని పణ్యవనిత" ననియె
"కలదె ముం దొక భార్య సత్కులజ ?" యనిన
"కల" దనియె రాజు సిగ్గుతో నలిగి నలిగి

"మతవిరుద్ధము మోహదూషితమునైన
పరిణయము లాడ వలదని పలికినావె
నీవు ము న్నన్నదేని రంజితుడ" యనిన
"పలికి యుంటి" నన్నె రాజు కలగి కలగి

“ ధర్మములు చెప్పి నీవె యీ తప్పు లేల ?
ఇటకు రానేల? ” యనగ - “ఆ నటిని జూడ
ఓర్మి పోయెను, వచ్చి నిల్చుంటి నిచట
శిక్ష కోస” మ్మనెఁ రాజు చివికి చివికి

“ అనుభవించెదవా శిక్ష? ” యనగ నతడు
“ తప్ప ” దనె రాజు సర్వసిద్ధముగ నిలచి,-
కూడి రప్పుడు జననాయకులు రహస్య
భాషణము లాడ నేకాంతపార్శ్వమందు

అట ననంతమ్ముగా న్నుండినట్టి ప్రజలు
చెవులు నిక్కించుకొని పైకి శిరము లెత్తి
తీక్ష్ణముగ జూతు రవనీశు దిక్కు నెట్టి
శిక్ష విధియింతురో విన సిద్ధులగుచు

అప్పు డా అకాలి పులసింహు డగ్రపీఠ
మెక్కి ‘నిశ్శబ్ద’ మని ప్రజ దిక్కు చూచి
సద్దు మణగి సభఁ శాంతి సమకొనంగ
నవనిపుని వైపు వ్రేల్ జూపి యనియె నిటుల

" నిందితుడయ్యె నీ ధరణి
నేత యితండు సమస్త రాజ్యమం
దందఱి ప్రాణమానవిజ
యాభ్యుదయమ్ములు వీని హస్తముల్
బొంది వసించు గాన జన
పోషకు డీతడు రాష్ట్రమందు నే
తుందుడు కుప్పతిల్లినను
దోషి యితండని చెప్పగావలెన్

ఈతని వర్తనమ్ము జను
లెల్లరు చూతురు వీనియట్ల పో
జూతురు వారలున్ - కనుక
చోదకు డీతడు తప్పుత్రోవలన్
నీతికి దూరుడై చనుట
నెమ్మది కాదు ప్రజాశయమ్మునం
దీత డలక్ష్యభావమున
నేగిన క్షేమము లేదు వీనికిన్

మిమ్ము దృఢీకరించి తన
మేరను దాటి పాతప్రబోధముల్
వమ్ముగ జేసి కట్టుకొనె
వారలతాంగి నొకర్తు నిట్టి దో
షమ్ము నొసర్చి సిగ్గిలి వి
చారముతో గనువాడు చూతురే
యిమ్మహీపుండు ! వీని కివు
డీయవలెఁ దగు శిక్షనే కదా”

అన విని సభ్యు లెల్లరు జ
యధ్వని రేపుచు 'శిక్ష శిక్ష' యం
చనిరి ధరేశపాదయుగ
ళాధరభూస్థలి బ్రద్ధులై 'ధణాం
ధణ' యని యన్న మాద్రిగ న
తంతు మనమ్మున కంప మొందె దం
డన మది మృత్యుగర్జగ వి
సంబము నేదియో యంచు గుంచుచున్

చేయి నెత్తెను పులసింహుడు
జయరావము లాపి జనులు శాంతులు గాగన్
నియమితదండన మాతడు
రయమున వినిపింప దొడగె ప్రభునకు ప్రజకున్

“ ఈ గురుపీఠిచెంత కెవ
రెవ్వరు పెద్దలు చిన్నలేసియున్
రాగలవారొ ప్రత్యహము
నన్ గురుసేవకు వారు వారలిం
దీగుచు ద్వారమందు నెడ
యించెడి చెప్పుల జోళ్ల ధూళి పో
బా గొనరింప గావలెను
పార్థివు డిర్వదియొక్క నాళులున్

తోన పలుదోము పుల్లలు తగినవాని
వెతకి కొనివచ్చి యిచ్చుచు విసుగు లేక
అన్ని దినములు నవ్వారి నవనిపాలు
డుదయవేళల సేవించుచుండవలయు

గురుపీఠమునకు వసుధా
వరు డొక లక్షయును పైన పాతిక వేలున్
విరళము నీయగ వలయును
గురుభక్తికి చిహ్నముగ నకుంఠితమతియై

ఇవియు గాక నింకొక్కటి యవనిపతికి
శిక్ష కల దద్ది విను - డొక్క చెట్టు మొదలు
నకు ప్రభుని కట్టివైచి నూటొకటి వరకు
దెబ్బలను గొట్టెద రతండు తినవలయును

జనపతి కిట్టి శిక్ష నిడ
సమ్మతమే జనులార మీ" కటం
చనె బుల్సింహు - డెల్ల ప్రజ
'లౌ' నని బల్కిరి భూమిపాలకుం
డనుమతి నిచ్చె "నింక తడ
వయ్యెది యేల? తొలంగ జేయు డా
తనిపయి నున్న గుడ్డ" లని
తాలిమి తూలి వచించి రా ప్రజల్

రణాజితుగుండెపై పిడుగు
రాలినయట్టులు కాఱుచీకటుల్
మునుకొని నల్గడల్ బలసి
పోయిన యట్టులు ప్రాణమానముల్
తనను తొలంగినట్లు పగ
తాపవితానవితాంతదారుణ
వ్రణితుడగుచు తదాజ్ఞయు శ్ర
వఃపుటికోన బ్రతిధ్వనించెనున్

పులసింహుం డటు లన్న పల్కు లవి యే
వో సభ్యాలం దృష్టిసే
య లపింపంబడె నంచు భూమిపతి యూ
హల్ సేసె గానీ - యిటుల్
నిలువందీతురటంచు శాపమత
డే నిశ్వాసమందేనియున్
దలచన్ లే దిదె స్వప్నమం దయిన బ్రా
ణ మ్మప్పుడే పోవదే!

చెదరిన గుండెతో ప్రభువు
చేయున దేమియు లేక మెల్లగా
వదలిచి వైచె పైని గల
వస్త్రము, లప్పు డాకండు సేవకుం
డదరుచు వచ్చి భూమిపతి
నచ్చటి చెట్టుకు గట్టివైచి కే
ల దురుసుబెత్త మొండు గొని
లజ్జితు డానకు వేచి యున్నడా

దీనమ్మైన ధరాధినాయకుని మూ
ర్తిం జూచినా రెల్లవా
రా నైరాశ్యము జూడలేక హృదయా
యఃపిండముల్ నీరుగా
మౌన మ్మూనిరి పల్కనేర రెదుటన్
ప్రమాస్పష్ట పాంచాలపృ
థ్వీనాథాంచిత హైమదేహమున మో
దెన్ సేవకుం డప్పుడే

పడియె నొక దెబ్బ, ఎవ్వరు పలుకలేదు
పడిన దంతట రెండవ ప్రహారణమ్ము
ప్రజల కన్నులు బాష్పస్రవంతులయ్యె
రాతిగుండెల కరుణాంకురమ్ము లొలికె

మూడవసారి సేవకుడు
మోదుట కెత్తెను బెత్తు; మెల్ల హృ
న్నీడములన్ కృపావిహగ
నిస్తుల వేదన లుప్పతిల్లె - వి
న్నాడు అకాలి - ఆగు మని
నాడు - భటుండు బెత్తమున్
తోడన దించె సభ్యుల ప్ర
మోద మదెంతయొ చెప్పలే మికన్

మిగుల నాసక్తి శ్రద్ధయున్ మొగములందు
చిందుచుండ ప్రజల్ ఫులసింహు డేమి
బలుకు వాడో యటంచు నిశ్చలితులైరి
అదను గ్రహియించి అతడు మాటాడ దొడగె

"జనులారా! మరలన్ భటుండు ధరణీ
శసువర్ణ దేహాన దె
బ్బను దాకించెడి పూర్వ మొక్క నుడి చె
ప్పన్ గోర్కె నాకున్న దీ
జనపాలాగ్రణి నిందితుం డగుటయున్
సత్యమ్మె యూ గాక భూ
మిని పాలించుటకున్ గోన దక్షు డెవ్వడున్
మీ మేలుకై కంట వ
త్తిని చేగత్తిని బెట్టి పట్టుకొని మి
త్తిన్ గాని లెక్కించెనే?

అరివర్గమ్ములు వీని పేరు విని సిం
హ స్వప్న మైనట్లు బం
ధుర భీతిభ్రమచింత లావరిలగా
దూరమ్మో దూరమ్మొపో
దురు పాంచాలము దాక గల్గుదురె మీ
తొల్లింటి పున్నెంపు పం
ట రహించున్ రణజిత్స్వరూపమున దై
న్యమ్మొందె నే దాతడే

ఎవని కత్తి పఠానుల కవచములను
దూరి నిత్యాసృగభిషేక తుష్టినొందె
ఎవని ప్రతిభాపతాక మిన్నెక్కి యాడె
అతడు ప్రాంజలి యౌచు నిందితుడ ననియె

ఆ కేసరి ప్రాణమ్ముల
కీ కర్కశబాధ లెంత హీనమ్ములొకో
అకృతజ్ఞులమై మన విభు
బోకారుచు కొనుట తగని బుద్ధిగ దలతున్

అనుటె తడవుగ సభ్యు లాహ్లాదభరిత
హృదయపూరతరంగితవృత్తులైరి
'జయము రణజిత్ ప్రభో నీకు జయము జయము
జయము పాంచాలకేసరీ జయము' అనిరి

కట్లు విడిపోయె జేనికి కనులవెంట
బాష్పముల పోత ఆగని వరద యయ్యె
జనులముందు వితర్దిపై జనవిభుండు
నిలిచి "ప్రజలార నన్ను మన్నింపు" డనియె

*       *       *

*

ఇది మరువరాని జాతీయహృదయఘనత
జాటిజెప్పెడి భారతచరితలోన
మాసిపోవని ఘట్టమ్ము : మహింపు లిట్టి
శక్తి గురుతించి మెలగుట సర్వశుభము

*       *

*       *       *

---

శ్రీ బాలా త్రిపుర సుందరీ ప్రెస్, జనరల్ బజారు, సికింద్రాబా
మొదటి ముద్రణ : ౫౦౦